శ్రీ



# ఆంధ్ర మహావిష్ణువు

(ద్విపద కావ్యము)



రచయిత

వజ్ఝల కాళిదాసు





ప్రవాసి ప్రచురణలు

ఆంధ్ర విజ్ఞాన సమితి

విద్దినివాస్, 'ఎమ్' రోడ్డు

బిష్టుపూర్,

జంషెడ్‌పూర్.

శ్రీ

# ఆముఖము

*

ఆంధ్రజాతి మూలపురుషుడుగా చారిత్రిక ప్రసిద్ధిపొందిన "ఆంధ్రమహావిష్ణువు" గాధ మా ద్వితీయ ప్రచురణగా పాఠకలోకానికి అందిస్తున్నాము.

ఈ ద్విపదకావ్యము ఆంధ్ర సచిత్ర వార పత్రిక స్వర్ణోత్సవసందర్భములో బహుమతి గణించుకొన్నది.

ఆంధ్ర విజ్ఞాన సమితి ముఖ్యాశయాలలో "ఆంధ్రులలో విజ్ఞాన జిజ్ఞాస పెంపొందించటము" ఒకటి. ఆ ఆశయ ప్రతిఫలమే ఈరచన, ఈప్రచురణ.

ఆంధ్రవిజ్ఞానసమితి తలపెట్టిన యీ విజ్ఞాన యాత్రలో ఆంధ్రు లందరూ పాల్గొంటారనే మా ఆశ! ఆశయాలు నెరవేరాలంటే వాటికి మొదట ఉన్న 'ఆశ' సిద్ధించాలని మేము, మీరూ కార్య రూపంలో కనబర్చాలి.

ఆంధ్రవిజ్ఞానసమితి వ్యాపారసంస్థ కాదు; కాని వ్యాపారదృష్టి తన ఆశయాలకి విరుద్ధంగా లేని పద్ధతిలో వుంచుకొంటుంది. అంటే యావదాంధ్రుల సహకారసంపత్తిని, సమాదరణని, ఆధారంగా చేసుకొని పురోగమించ ప్రయత్నిస్తుంది.

విజ్ఞానమూ, వినోదమూ జోడించరాదని మేమనము. ఆ జోడించుటలో వున్న విభిన్న దృక్పథాల్లో మా ఆశయాలకి అనుగుణమైన దారి త్రొక్కడమే మా సంకల్పము.

భవదీయులు,

ఆంధ్ర విజ్ఞాన సమితి



కృతికర్త

వఝ్ఝల కాళిదాసు

‘ఆంధ్ర మహా విష్ణువు’

ప్రతులకు

1

ఆంధ్ర విజ్ఞాన సమితి

విర్ది నివాస్ : ఎమ్. రోడ్

జమ్‌షెడ్‌పుర్



లేక

2

వఝ్ఝుల కాళిదాసు

క్వార్టర్ నెం. 116, రోడ్ నెం. 6

బి. హెచ్. ఏరియా,

కదమా

జమ్‌షెడ్‌పుర్



అనిర్వాయుడు

శ్రీ

# ఆంధ్ర

# మహా విష్ణువు

*

## ప్రథమాశ్వాసము

*

### * అవతారిక *

శ్రీరమా రమణి యాశీర్వాద బలము
గౌరీ ప్రసన్న వీక్షా శుభ ఫలము
భారతీ గురు కృపాపార వైభవము
కోరి మ్రొక్కెడి పూనుకొందు లాఘవము
నిండార, పల్కు తేనియలు పెల్లార
గండు కోకిలపాట గతులు పెంపార
అమలిన భావ విన్యాసంబు మీర
కమనీయ కవితా వికాసంబు చేర
వినిపించుటకు ఆంధ్ర విష్ణువు కథను
వినుత చరితాబ్ధి వెడలిన సుధను.

నా తెల్గు మాట చందమ్ములో కులుకు
నా తెల్గు నుడుల యందముల క్రొందళుకు
నా తెల్గు వాణి విన్యాసంపు హాయలు
నా తెల్గు పల్కు క్రొన్ననల తేనియలు
కమనీయ రస తరంగములుగా కావ్య
సముదాయముల వెదజల్లిన యట్టి
సకలాంధ్ర సుకవీంద్ర సంతతికెల్ల
అకలంక మగు భక్తి నంజలి పట్టి
వారి యాశీః పరంపరల నర్థింతు
నా రచనా విధానము జయమంద !

* * *

అని దేవతా ప్రార్థనాదికంబులను
పొనరించి రచనా ప్రమోద సంబుద్ధిఁ
దలపెట్టినది చరిత్రమహాంధకార
ముల మూలలన్ బడిపోయిన గాథ
యని వికలాత్ముడనై యుండు వేళఁ
గనిపించె—కలయొ నిక్కమొ చెప్పజాల !—

కలిత విభూతి రేఖా ఫాలభాగు
డలఘు కృపా భరితాంత రంగుండు
భాగవత నుతుండు భవ్యగుణుండు
రాగ విరాగి సర్వజ్ఞుండు త్యాగి
సహధర్మచారిణి సామేన వెలయు
మహిత శోభాఢ్యు డుమామహేశ్వరుడు.
పలికె నంతట స్వీయ వాగ్వైభవమున
సలలితమైన యాజ్ఞనె వాంఛరీతి !

"వ్రాసి యున్నాడవు బహుకృతుల్ తెల్గు
బాసలో మును గద్య పద్య గేయాల;
క్రొత్త ప్రాతలు నీవు కూర్పుల లోన
పొత్తునంది రసజ్ఞ మోదంబు వడసె;
నాభక్తు లెందరో ననుగూర్చి ద్విపద
లో భూరి కావ్యముల్ గూర్చియున్నారు
తెలుగు నెన్నుడి సొంపు తీయముల్ నిండ;
తెలుగన్న నాకబ్బె తీరని ప్రేమ !
తలచియున్నావు కదా తెల్గు రేని
యలఘు చరిత్ర వ్రాయగ, పురాగాథ

కనువగు కల్పన లందందుఁ జేర్చి
వినిపింపుము తెనుంగు ద్విపద కావ్యముగ
అంతర్హితుండయ్యె నానతి యిచ్చి
అంతట నే నిశ్చితాత్ముడ నగుచుఁ
దలపోసు కొంటి నుత్సాహంబు నిండ
తెలుగు చరిత్రలో దివ్యఘట్టముల.

తెలుగు వారల సుప్రతిష్ఠకు బీజ
ములు మూడు వేలేండ్ల పూర్వమే వేద
కాలంబులో పడ్డగాధలు, తెల్గు
నేలనేలిన మహానీయు రాజాధి
రాజుల దివ్య పరాక్రమ కథలు
పూజనీయములున్ బ్రమోదాత్మకములు!

ఐతరేయ బ్రాహ్మణాంతర్గతముగ
పూతాంధ్ర శబ్దంబు పొడమె తొల్దొలుత!

చీమలు దూరని చిట్టడవులకు
ధామమై యున్నట్టి ధరణి ఖండంబు,
కాకులు దూరని కారడవుల క
నేకంబులకు పుట్టినిల్లయి కట్టిన

యంధకారావృత మైనట్టి భూమి
యంధ దేశంబని, ఆంధ్ర దేశమని
భారతావని నొక భాగంబు మున్ను
పేరంబె ననికూడ వినుచుఁ జరిత్ర!

పొలుచు మహాక్షేత్రములుగ నేటికిని
అలఘు దాక్షారామ మంచు, శ్రీశైల
మందును, శ్రీకాళహస్తిని ఖ్యాతి
పొందినట్టి త్రిలింగములు సర్వపూజ్య
ములుగ వెల్గొందుట మున్ను తద్భూమి
కలవడెను త్రిలింగ మనుపేరు—క్రమము
గానది తెలుగని కాంచెను పేరు
గానని చారిత్రకమగు ప్రసిద్ధి!

మొదట నాపస్తంభ బోధాయనాది
సదమల సూత్ర విజ్ఞాన నిర్మాణ
చణులైన వారల సంప్రదాయంబు
గణుతికెక్కెను త్రిలింగ ప్రదేశమున—
ఆమహా ప్రతిభయే యాంధ్ర విజ్ఞాన
ధామంబునకు పవిత్రమగు పునాది!

ఆదిఁ జండాశోకుఁడనుపేరు మోసి
దేదీప్యమానగతిన్ రణభూమిఁ
జెలువొంది నట్టి యఁజేయు నెదిర్చి,
నిలచి, యాతని ననిన్ విజయ విహీనుఁ
నొనరించి, కేవల యుద్ధమార్గమున
జనులను గెల్చుట జ్ఞాన హీనంబు,
తనువు గెల్చుట పశు ధర్మంబె యగును,
మనసుల గెల్చెడి మార్గం బహింస,
మానవ కల్యాణ మార్గం బహింస,
యానని శాంతియు నని బోధసేసి
యాతనిపేరు శాంతాశోకు డనెడి
ఖ్యాతి బొందగ మూలకారణం బాంధ్ర
జాతియే యని పూర్వచరిత లిఖించె
పూత సువర్ణ సంపూర్ణాక్షరముల !
—కనమె యశోక చక్రంబు నీనాడు
వినుత భారత భాగ్య విభవ చిహ్నముగఁ
జాతీయమది, ఆంధ్రజాతి మేల్కొలుపు
వైతాళిక మనోజ్ఞ భావగీతంబు !—

# ఆంధ్ర మహావిష్ణువు

గౌతమీ సుత శాతకర్ణి యాంధ్రులకు
ఖ్యాతి గూర్చిన యుగకర్తయై వెలసె;
శాలివాహనుడని శాతవాహనుడె
హాలుని సంతతి యుందుఁ బేరందె !
ఆనాటి వైభవం బానాటి కళలు
ఆనాటి ఆంధ్రమహా వీరకథలు
విజ్ఞాన శిఖరాల వెలసియాడినవి
ప్రాజ్ఞుల మెప్పందె పాశ్చాత్యదేశాల !
వాకాటకులు బృహత్పలాయనాద్య
నేక వంశము లప్పుడేలె నాంధ్రమును.

తరచినచోఁ జరిత్రమహాంబు రాశి
నరుదైన యాంధ్ర కథామృత మురలు!
దేశ దేశాలలో స్థిరముగా నిలచె
ఆశాంతముల దాటె నాంధ్రుల ప్రతిభ !
మలయా, సుమత్రా, చంపా, సయాం, బర్మ
వలసలయ్యెను తెల్గువారి కానాడు;
పూనాను, జావ, కాంభోజి యాంధ్రులకు
వాణిజ్య సీమలై వరలె నానాడు !

శ్రీయా ప్రదేశాల నాలయ సంప్ర
దాయ శిల్పాల నాంధ్రత్వంబు, వంద
లాది యేండ్లైన నత్యాశ్చర్య కరము
గాదె యీనాటికిన్ గన్పించుచుండు !

కాలగర్భపు టంధకారాన మరపు
పాలైన యాంధ్రుల ప్రతిభ, చరిత్ర
పరిశోధనలకాంతి బయలై యపూర్వ
సురుచిర సుందర జ్యోత్స్నల నీను !

అలనాడు శ్రీపర్వతాగ్రంబు నందు
వెలిగె జాజ్వల్యమై విజ్ఞాన దీప
మాచార్య నాగార్జు నావిష్కృతమయి;
ఆ చరిత్రము సువర్ణాక్షరపంక్తి
మాలికలై సర్వమానవ హృదయ
శాలల నివసించు సమయ మేతెంచె !—
పూర్వ విద్యాలయంబులకు మూలంబు
సర్వవిజ్ఞానైక సాగరం బనుచు
నార్జించు కొనిన నాగార్జునాచార్య
నిర్జర ప్రతిభకు నెలవాంధ్ర భూమి !

శ్రీసర్వాతమున నిక్షిప్తమ్ములైన
యీ పురాశోభ చిహ్నములు నేటికిని
విరియించు విజ్ఞాస వీథులలోన
తొనళమనోజ్ఞ సుందరసుమస్రజము
విస్మృతిగహనాంధ వీథులఁ జరిత
స్ఫురణ మరీచిశోభలు నిండ
పూర్వాంధ్ర వైభవంబులు కండ్లగట్టు,
గర్వంబుతో తెల్గుగడ్డ యుప్పొంగు !

* ష ట్ప్యం త ము లు *

అనుపమాన పరాక్రమార్జితకీర్తి
దినమణి తేజులు తెలుగువారలకు !

సుమరసోద్భూతంబు జుష్టంబుగాన
అమృతంబు హాలాహలానుజంబగుట
తమసలుకుల తీయదనముల కెంపు
సమముకావనఁజాలు చక్కని కావ్య
ముల యందు నవరసమ్ములు జొబ్బిలంగఁ
దెలిపిన ప్రోడలు తెలుగువారలకు !

ఊరీకృతస్వకీ యోర్వీవిభాగ
ధీసు లుదారులు తెలుంగువారలకు !

అభ్యుదయ పరంపరాభివృద్ధిగను
లభ్యవాంఛా సత్ఫలప్రదంబుగను
నేను రచింపఁబూనిన యాంధ్రవిష్ణు
మానవేంద్ర కథాక్రమం బెట్టిదనిన—

* క థా ప్రా రం భ ము *

ఇందనీలోపల కల్పితానేక రమ్య
సుందరభవన సంశోభితంబగుచు,
ఉరుశిలానిర్మితాత్యున్నత కుడ్య
విరచిత ప్రాకార వేష్టితంబగుచు,
వైరి జనాగమ్య వారి పూరిత గ
భీరతరాఘాట వృత్తంబునగుచు,
నగరి యొండెసగు కృష్ణాతీరమందు
అగణిత భోగభాగ్యములకు నెలవు
భారత దక్షిణాపథ కంఠలోల
హార దీప్తతరళమనగ శ్రీకాకుళము !

ప్రకృతి నిర్మించిన పరిఖవిధాన
నొకవంకఁ బారుచున్నట్టి కృష్ణ
అంతఃపురాంగనాభ్యంగ నార్ద్రార్ద్ర
కుంతల కాంతులకున్ సాటివచ్చు.
ప్రాగవనీధరాగ్రములపై ప్రావృ
షాగమనంబున నంబుధరాలు
నీరంధ్రములు మహా నిబిడముల్ చేరి
ధారలై కురియఁ దత్ జలసమూహంబు
పరువిడుచున్నట్టి వారుణాశ్వముల
సరణికొండల జారి చరియల దూరి
గట్టులపై నురకలువెట్టి దాటి
చెట్టులచేమలఁ జీలిచి వైచి
గండశిలా శ్రేణి ఖండించి త్రోసి
చం వేగమ్మున జారి నేలపయి
కాసంతవిశ్రాంతి గాంచి నిజధవు
డా సముద్రుని జేర నతివేగమలరఁ
బల్లముల్ వెదకుచుఁ బరుగులనిడుచు
ఉల్లాస మూర్తులై యుబ్బితలూప

తెలుగుపొలాల కందించు నీరముల
కిలకిలనవ్వుచు కృష్ణవేణమ్మ !

ఆనాడదెపుడో వేణ్యానది—వేణ్ణా
నానొప్పెడినది—కృష్ణానదియందుఁ
గలిసియుంటఁ జరిత్రకారులుచూపి
ఎలరారెనందుకు కృష్ణవేణ్యాఖ్య !

నీలంబులైనట్టి నీరంబు లెల్ల
వేళల నానది వెలయుటనేమొ,
అందమ్ముగాదువ్వి యల్లినయట్టి
సుందరీమణి వేణి సోయగమ్ములకు
నిరవౌటనో దానిఁ గృష్ణవేణియని
పరిసరమ్ముల జనపదములవారు
పిలువదొడంగిరి—ప్రీతిమై ముద్దు
పిలుపుగా కృష్ణయన్ పేరునుగలిగె !

చల్లగా కృష్ణమ్మ సాగుచునుండ
నుల్లమ్ములకు నమితోల్లాసమొసగు
పిల్లగాలులు మెల్లవీచుచు ప్రాంత
ఫుల్లపుష్పసుగంధముల వెదజల్లు !

పారమ్ములంటుచుఁ బారెడి కృష్ణ
సౌరును తిలకింప క్షాత్రికివచ్చు
మందమ్ముగాఁజను మత్తేభపంక్తి
కందర్ప శింజినీ గాఢ కార్ష్ణ్యములు !

కృష్ణవేణీ తరంగిణ్యంబు సుధలు !
కృష్ణాశమనముల్ ధరిత్రికంతటికి
చల్లగా మెల్లగా సాగినా కృష్ణ
పల్లవించును వాడవాడల ముదము !
పొంగినా యొడ్డెక్కిపోయి కృష్ణమ్మ
కుంగిపోవును ప్రాణికోట్ల యెదలు;
ఎండినా గ్రీష్మాన కృష్ణవేణమ్మ
గుండె బీటలువారుఁ గువలయంబునకు !

తెలుగు నెన్నుదురు పై తిలకంబు వోలె
తెలుగుగృహంబులో దీపంబులీల
ఆంధ్రిదేవీ కంఠహారంబురీతి
ఆంధ్రప్రజా దరహాస రేఖగతి
చెలువొందు నిర్మల జీవనదాత్రి
కిలకిలనవ్వుల కృష్ణవేణమ్మ !

రా జిల్లు కృష్ణతీరంబున నాంధ్ర
రాజధానీ నగరంబు కాకుళము

పురవీధులు సుదీర్ఘములు విశాలములు
పరిశుభ్రములు...ఇసుసంకల యందు
తరువు లందందు సుందరముగాఁ బెరిగి
పరచు లేనీడల పాంథుల కొరకు.
అంగణమ్ముల నున్న యనటుల గెలల
రంగులు, పంచవర్ణముల కీరములు
గుమికూడియున్నవి గుంపులై యనెడి
భ్రమ చూపరులకుఁ గల్పన మొనరించు.
పాలరా తిన్నెలపై లోహాఖట శి
ఖాలంబ దీపశిఖల్‌—కూడలులను—
ప్రతిబింబితమయి ఉప్పరమున కెగసి
ధృతి చంద్రశాలలై దిగజారు భువికి !

ప్రాసాద పరిసర భాసిత విమల
కాసార మృదుతరంగ చలన డోలి
కా సముల్లసితహా కల్హార పంక్తి
వాసింపజేయు సువాసనల్‌ వీట !

శ్రావణ జయవాసరమ్ములఁ గన్య
కావళి పురవీధులందుఁ బేరంట
ములకయి మెల్లగాఁ బోవుచునుండ
మలయ సమీర కుమార సంచలిత
వసనాంచలమ్ము లప్సరసల గెల్చి
విసరు జయపతాక విధములదోచు !

ఉన్నత దివ్యసౌధోపరి సీమ
కన్నియల్ వీణెలఁ గల్పించు మధుర
మోహన సంగీతములు సంజలందు
వైహాయస పథాల వర్ణముల్ దిద్దు !
ప్రమదా వనీవిహార వినోద లోల
రమణీ గళోన్ముక్త రమణీయ గీత
ములు, ప్రతిధ్వనులీన ముగ్ధ లచ్చరలు
పలుకు చున్నారలన్ భ్రాంతి కల్పించు !

ప్రోలున నేలవేల్పులు వేల్పుటొజ్జ
మేలమాడెదరు ప్రామినుకులలోన;
కొనగోటితో మే[illegible]
తునియలుగాఁ జేయుదురు [illegible]

నాడె కాడులు పత్త్రసమునఁ గన్నెత్తి
చూడరు కడలి వచ్చుట నీటియిక్క-;
పసిడిపండును విను వాక తోఁ బుట్టు
లిసుక పట్టుల విత్తురేని యుద్రబముగ;
వేడుక కత్తెలు వేల్పుల యెనాట
నాడుచో నచ్చర లందెద రీల!

వారువమ్ముల బారు పసగిడెనేని
సారెకు వెన్నాడు ఝంఝానిలములు;
మదగజమ్ములు పోవ మంద మందముగ
కదలు దిగంత భాగమ్ముల ధరణి;
చతురంగ బలములు ఛద్మాజి నడువ
ధృతిదూలి బెగడొందు దేవసైన్యములు:
స్వవిధి నిమగ్నైక జనసంకులంబు
వివిధకళాదిపరిపీణ వాసంబు
పురుహూత సైరిభంబునకు సమంబు
సిరికాలవాలంబు శ్రీకాకుళంబు!

ఆంధ్రప్రజాపాలకాగ్రగణ్యుండు
ఆంధ్రప్రజాహృదయైకమాన్యుండు

సూరిజనస్తుత్య సుగుణసాంద్రుండు
భూరి యశోజిత పూర్ణచంద్రుండు
అలఘువైభవ నిర్జితామరేంద్రుండు
అలరుఁగాకుళనేతయగు సుచంద్రుండు.

ఆతని పాలనమందున్న జనులు
నీతిమంతులు, మహనీయులు, ఘనులు;
పరిహాసమునకైన బలుక రనృతము
వరసౌఖ్యభరితంబు వారిజీవితము !
తమరాజువల్లనే దమకింత సౌఖ్య
మమరుచున్నది యని అనుకొనుప్రజలు,
తన ప్రజవల్లనే తనకింతకీర్తి
తనరుచున్నదటంచుఁ దలఁచును రాజు !
కమనీయతరలసత్ కౌముదీచంద్రి
సమముల్ ప్రజా రాజ సరళభావములు !



శ్రీ

# ఆంధ్ర

# మహావిష్ణువు

*

## ద్వితీయాశ్వాసము

*

ఆసుచంద్రునకు మహావిష్ణునాము
డౌ సుతుం డుండె : జయంత వసంత
కందర్పసన్నిభాకారుండు, ధైర్య
మందిరుండు, పరాక్రమ సమువేతుండు,
వినయవివేకుండు, వితరణశాలి
అనవరతార్ద్రి సత్యవచనశీలి
శాస్త్రాభ్యసన పరిజ్ఞానచణుండు
అస్త్రప్రయోగవిద్యాప్రవీణుండు.

విజయలక్ష్మికన్యం విఖ్యాతరూప
విజితరతీదేవిం బెండిలియాడి,

అనుపమదివ్యసౌఖ్యాబ్ధులఁ దేలు
చు నెసంగు ఆంధ్రవిష్ణువు—యువరాజు !

అంత లతాంతకాంతార్ద్రపరిశాంత
కాంతులతో నవకా రేగుదెంచె;
చివురులదొడిగిన చెట్లలో ప్రకృతి
నవవికాసమ్ముతో నాట్యమ్మొనర్చె;
విపులనేత్రావుల విరజిమ్ముచున్న
మరుదంకురముల కమ్మనసంబుమీరె;
వీనులవిందుగా వినిపించె కొండ
కోనలలోనుండి కోకిల పిలుపు !
యువదంపతుల కమితోత్సాహదముగ
నవ వసంతాగమనమ్ము కన్పించె !

తరణి తీక్ష్ణకరకింక తాళగలేక
తరుగజొచ్చెను నిశీథమ్ములనిడివి:
వారాసిగర్భసుప్త మహానలంబు
ధారుణివేఁచ నుద్భవమందెరవిగ;
శత శతఘ్నీగోళ సంజనితాగ్నిఁ
గుతలమ్ముపై జిమ్మె కూరోష్మకమ్ము;

కాలరాక్షసి నిదాఘమహాస్త్రమనని
జ్వాలామయమ్ముగా సలిపి పైచినది.

కేళాకుళుల శీత కీలాలభంగ
మాలికాడోలల మలయికల్ సలిపి
విమల మల్లిదళ విరచితశయ్య
లమరించుకొని గంధమలదిన మేన
తామరతూడులదాల్చి నికుంజ
సీమలలో సినసించుచు నెట్లొ
గడపినారలు వెట్టకాయు రోజులను
పడతిలక్ష్మియు నాంధ్రవర్థమానుండు!

శ్రీలకరిమెరుపులు దోబూచులాడెఁ
గులుకుచు మేఘావగుంఠనమ్ములను:
కారుమేఘమ్ములు క్రమ్మెను మింట
ధారలై నీరంబు ధరణిపై కురిసె:
జలముక్ చయం బాకసంబున జేరి
సలిలభాండమ్ముల సరణిఁగన్పించె!
నీరామనులఁ గృష్ణ నింపగా జలవి
హార కేళీలోలులైరి దంపతులు.

కడిగినయటుల నాకాశంబు కాన
బడియె నిర్ధంబును స్వచ్ఛంబునగుచు !
శారదపూర్ణిమా చంద్రికాకాంతి
వారాశులకు దివ్యపర్వమ్మొనర్చె !
నెలరేడుజల్లు వెన్నెలలందు చంద్రి
శిలల తిన్నెలు రస స్నిగ్ధంబులయ్యె.
ప్రకృతికన్యక శరదాత్రులయందు
ప్రకటించె స్వీయ శోభాపరంపరల,
కలిగించె రాగప్రగాఢ సౌఖ్యముల
తెలుగువెన్నెలకును తెలుగులసిరికి!

హరితశాద్వలవీధి నాణిముత్యాల
సరుల హేమంతము జల్లుచువచ్చె;
తెలిమంచు తెరల సందిటఁజిక్కి, రేయి
కలికి, దారియెరుంగకయె తొట్రులాడె !
మంచుకారునఁ గారుమంచు దూగరల
నించుకించుక హసియించెఁ దారకలు
సీతువు రక్కసి చెట్లపై మంచు
చేతులబరపి కోసినది యాకులను;

చలికాగలేక ముజ్జగములు బెగడి
జ్వాలనార్కదేవుల శరణుజొచ్చినవి.

పగటివెల్గులు, రేయి పాణింధమములు,
సొగసుల ననకాను సొంపులు, తపన
భైరవవేదనల్, పావృషవారి
ధారలు, తొలకరి తరిపి వెన్నెలలు,
సహా తపో జనిత తుషారధూమికలు
విహితకాలరథాన విహరించుచుండు.

అన్ని కాలముల నన్యోన్యతంఁ దెలుగు
వెన్నుడు సిరియును వెడలబుచ్చెదరు!
వారి యన్యోన్య దాంపత్యజీవితము,
వారి పరస్పర భావైక్యతయును,
వారి వినిర్మల ప్రణయవైభవము,
వారికి నెనలేని ప్రఖ్యాతిగూర్చె!

జననికి సేవలు సలుపుటలోన
తన సతియుండ సంతసమందునతడు;
తాను నిత్యము తండ్రి తలపు లెరింగి
పూని చేయును కార్యములను వేవేగ!

విజయలక్ష్మియు నాంధ్రవిష్ణువు నవిన
ప్రజల కందరకు గౌరవమును పెంచు !

తన వంశమునకును దనకునుగూడ
ననుపమానంబైన యట్టి యశస్సు
వెలయింప గలవాడు విష్ణువటంచుఁ
దలచి సుచంద్రు డుత్సాహంబుమీర
శుభముహూర్తంబున సుతునకు రాజ్య
మభిషేక మొనరించె నతివైభవముగ!

ఆ శుభసమయంబు నందాంధ్రదేశ
మాశీఃప్రసూనాక్షతావళి జల్లె !
ఆయభిషేక శుభావసరమున
కోయిల పాటలన్ గొసరి విన్పించె;
ప్రమదావనీ వృక్షపంక్తి నవీన
సుమ సముదాయ సంశోభితం బయ్యె;
కిలకిలారావముల్ కింకిణీధ్వనుల
దలపించుచున్ బక్షితతి నాట్యమాడె;
మలయశృంగాంగ్ర సీమలనుండి దొరలె
మెలమెల్ల పిల్లతెమ్మెరల దొంతరలు;

చిరుకెరటమ్ముల చేతులనెత్తి
నురుచె జప్పట్లు కృష్ణాసరిత్కన్య;
ఆకాశదీపంబు లట్లు వెలింగె
రాకేందు బింబ తారాసమూహంబు;
ప్రాంగణంబుల రంగవల్లులు దిద్ది
రంగనాజన సమూహము వీధివీధి;
సర్వంబుగా నాటి పట్టాభిషేక
ముర్వర తిలకించె నుత్సాహమడర!

ఆయభిషేక శుభావసరమున
జేయని ప్రజలు నచించినపల్కు
లంబరవీధుల నంటె; ప్రతి స్వ
నంబుల దిగ్దిగంతంబులు నీనె.
ఆహూతులైనట్టి యువసేందులెల్ల
స్నేహంబుతో నభిషేకంబు జూడ
నరుదెంచి స్వీయ సౌహార్దంబు దెలుపు
నరుదైన కానుకల నందించినారు!

అభిషేక సంరంభ మణగిన పిదప
ప్రభువు విష్ణువు పరిపాలనాక్రమము

నందు మున్నెన్నడు ననుకోని యట్టి
చందమ్ముగా సర్వజన సమ్మతముగ
క్రొత్తమార్గమ్ములన్ ద్రొక్కుచుఁ బ్రా
కోత్తముడన్ కీర్తి నుర్విఁగణించె!

బాటలపై నిరువంకలఁ జెట్లు
నాటిరి పాంథజనశ్రమ దీర్ప;
పల్లె పల్లెకు క్రొత్త బాటలు కట్టి
రెల్లవారలును హాయిగఁ బ్రయాణింప;
సందేశహరులు దేశంబు నల్గడల
యందు లేఖావళు లందఁజేసెదరు;
అమృతతుల్య జలాశయ మనోహరములు,
రమణీయ సుందరా రామాభిరామ
ములునగు పట్టణంబులు కడు వెలసె;
కెలకులనున్నట్టి కేదారములకు
జలసమృద్ధినొసంగు చక్కని కాలు
వలను నిర్మించిరి—బహుముఖమ్ములుగ
నభివృద్ధిగాంచె రాజ్యంబదియెల్ల
ప్రభువాంధ్ర విష్ణువు పాలనమందు.

ఆతని పాలనమందున్న ప్రజలు
నీతిమంతులు, సత్యనియమ వర్తనులు,
వరగుణాఢ్యులు దేశభక్తి తత్పరులు
నిరతసద్బుద్ధులు నిస్వార్థపరులు
ప్రజలకున్ దగురాజు, రాజునకు దగు
ప్రజయునుమన్ బరస్పరమైనయట్టి
అనితర సాధ్యమైనట్టి యశస్సు
తనరె వారికి సుకృత ఫలంబుగాఁగ!

కాంచనపాత్రికు కమ్మదనంబు,
చంచలా లతల కచంచలకాంతి,
హరిచందనమున హిమాహ్వాయ సురభి,
విపుల కప్రతిహత విభవవాసనలు,
లభియించెననఁ గాకుళప్రజకబ్బె
ప్రభువాంధ్రవిష్ణువు పరిపాలనమ్ము!



శ్రీ

# ఆంధ్ర మహావిష్ణు

## తృతీయాశ్వాసము

ఆ కాలమందు నాగాంధ్రవంశజుల
కాకరంబైయున్న యట్టిరాజ్యంబు
పాలించుచున్ నిశంభసమాఖ్యుడైన
యేలిక యొకడుండె హేయగుణుండు!

ఏలిక కాళీయ కర్కోటక సహుష
కులజులైనట్టి నాగులచరిత్రంబు
కడుపురాతనము; నాగరకతగూడ
బడసి యార్యులతోడ బంధుత్వమంది
సహజశౌర్యమున రాజ్యములుస్థాపించి
వహియించి నార లపారగర్వంబు!

కామించి నాగేంద్రకన్య నులూచిఁ
గోమలి భార్యగాఁగొనె సవ్యసాచి.
ఉరగవంశజులు నార్యులు గొంత కాల
మరమరికల్లేని యట్టి సుస్నేహ
సరణి పెంపొందగాఁ జరియించినట్లు
చరితలో నచ్చటచ్చటఁగానిపించు !

తక్షశిలేశుండు తక్షకుం డల ప
రీక్షిత్ ప్రభుని సంహరించుట వలన
వైరంబు వారిలో వారికిఁ దీవ్ర
మై రగుల్కొలిపె మహారణంబులను.
జనమేజయుని మహాసర్పయాగమున
ఫణికులంబు సగంబు భస్మమై పోయె;
చెట్టు పుట్టల హత శేషాహికులము
పట్టిపోయెను నిజప్రాణరక్షణకు
అంతట క్రమముగా నడవులు, వాని
ప్రాంతభూములు నాగపాలితంబయ్యె.
నాగులలో ననంత పరాక్రముండు
భోగలాలసుడు దుర్బుద్ధి నిశంభుఁ

డతిమరితుం డసూయాపరుడయ్యె
క్షితిపతి విష్ణువు కీర్తినాలించి
కుత్సితభావుండు క్రూరుండుఖలుడు
మాత్సర్యమున నిశంభ ఫణీంద్రకులుడు
సిద్ధంబుసేయజొచ్చెన్ సైనికులను
యుద్ధావసర మహాయుధ గణంబులను.

"ఆరహస్య ప్రయత్నాది వార్తలను
చారులు కాకుళేశ్వరున కందింప
సచివ ముఖ్యులకును సైన్యాధిపులకు
వచియించె విష్ణువు స్పష్టవాక్యముల—

"రాజ్యంబు శౌర్యధైర్యప్రవీణులకె
భోజ్యంబనెడిమాట పొల్లుకాదనను;
రాజధర్మము ప్రజారక్షణం బరయ
రాజు కర్తవ్యంబు ప్రజలసౌఖ్యంబు.
రణము దారుణము మారణకర్మకాండ,
గుణశీలి మెన్నడున్ గోరడురణము.
పొరుగురాజగు నిశంభుడు దుష్టచింతc
బరమ గూఢంబుగా బలములcగూర్చు

కొనుచున్న వార్తలఁగొని వచ్చినారు
మనచారులిప్పుడే—మనమ పరిమిత్ర
గతినుండవలయు నేక్షణమేని యగునో.
చతురంగ బలముల సన్నద్ధపరచి
చతురత మెరయ దేశంబునల్లడల
కతిరహస్యంబుగా ననుపంగవలయు
సనసరంబగు నాందోళనంబు
మన ప్రజపొందని మార్గమూహించి.
పలికెద నొకటి విస్పష్టవాక్యముల...
తొలుదొల్త మనము కాల్దువ్వగావలదు
యుద్ధంబునకు—నాగు లుద్రేకవశత
నుద్ధతిజూపిన నూరుకోవలదు".

అంతట మంత్రిసైన్యాధిపుల్ ప్రభుని
యంతరంగమెరింగి యాతనివాక్య
సరణిలోనున్నట్టి సత్యంబునెల్ల
నరసిసవాకొట నతిరయంబునను
తమతమ ప్రతిభయంతయు నుట్టిపడగ
క్రమముగా సిద్ధంబు గావించినారు

నిటలాక్షునెదిరించి నిల్వగా జాలు
చటుల పరాక్రమసాహసనిధుల.

నేలయీనిన యట్లు, నింగిపైనుండి
వ్రాలినయట్లు కాల్బములు నిండె;
అరుగుదెంచినవి శతానంద నందఁ
బురుడించుచు శతాంగములు, తరండములు;
కాలాంబుదంబుల గతిక్రమ్మె నాల్గు
మూలల గజబలంబులు; వాయువేగ
మలరగా నేతెంచె నాశ్వికదళము;
నిలచిరందును నిర్ణితస్థలాల!



శ్రీ

# ఆంధ్ర మహావిష్ణువు

*

## చతుర్థాశ్వాసము

*

ధాత్రిపై కపటయుద్ధము చేయ నెంచి
రాత్రిక్షపాట చారగణంబులెల్ల
వెడలివచ్చిన వన్న విధమున మెల్ల
నిడుదలై తూర్పుగా నీడలుపాకె!
పడమటి సంద్రాన బడు సూర్యుఁజూచి
యడలి వెల్గులువీడె నవని తలమ్ము
అరుణవర్ణములు దిగంతంబు లందు
కరఁగి చోటిచ్చెఁ జీకటుల మూకలకు.

ఆనాడమావాశ్య, యంథకారంబు
తో నిండినది జగత్తు నలుమూలలును;

ఆమహానిబిడ తమోవగుంఠనము
లో మహీతలము విలుప్తమైపోయె;
అక్కడక్కడ మిన్కు మనుచు నభ్రమునఁ
జుక్కలించుక తొంగి చూచుచునుండె:
కానలు, కోనలు, గట్టులు, చెట్లు
కానరాకన్ని చీకటినేకమయ్యె;
ఆకాశమునుండి యవనికి చిట్ట
చీకటి పోతపోసినయట్లు తోచె.

ఆదె సమయంబని యల్ల నిశంభు
డదరిపాటున సేనకానతినిచ్చె
"చల్లగాఁగాకుళేశ్వరుని రాజ్యంపు
టెల్లలదాటి యూహింపగారాని
కైనడి భూమినాక్రమణంబు సేయఁ
గావలె నుదయంబు కాకముం"దనుచు!!
ఆనిశీథమున తమోవకుంఠనము
లో నిద్రపొత్తిళ్ళలో నున్నయట్టి
భూనభోంతరములు మూర్ఛిఘోషింప
వైనతేయ గరుత్ప్రభంజనోద్ధూత

సర్పగణంబు బుసల్ కొట్టినట్లు
దర్పంబునిండ నౌద్ధత్యంబు మీఱఁ
బల్లెలపైబడి పశువుల జంపి
కొల్లగొట్టి యమాయకులను వధించి
రణధర్మములు విసర్జన మొనరించి
ఫణిసైన్యతతి యాహవంబునకూనె !

ఆ యధర్మరణంబునందు రేగినవి
వాయువుతోడుగా బడబాగ్ని శిఖలు;
రోదసియెల్ల మార్మ్రోగిన దార్త
నాదాల విజయ నినాదాలతోడ.
తొలుదొల్తగా నిట్లు దొంగయుద్ధమ్ము
సలుపుటన్ వచ్చిన జయమున కుబ్బి
మన్ను మిన్నెఱుగని మదమున సర్వ
పన్నగ సైన్యముల్ బవరంబుజొచ్చె !

క్రమ్మిన యంధకారంబుల వెలికిఁ
జిమ్ముచు దినమణి స్మితరేఖలురికె,
తూరుపుకొండపైఁ దొగరులు కురిసె
ధారుణి క్రొత్త యుత్సాహంబు విరిసె !

గురుతర దేశభక్తులు యుద్ధనిపుణు
లరిభయంకరులు మహాబలశాలు
లురు పరాక్రమ సాహసోపేతు లాంధ్ర
ధరణీంద్రసైన్యముల్ తాకి చెండాడ
దొరకొనె నమితచాతుర్యంబు మెరయ.
నురగసైన్యంబుల నుద్ధృతశక్తి.
కరవాలములు రక్తకాంతుల మెరసె,
శరపరంపరలు వర్షమ్ముగా గురిసె.
కరవాలికా పరిఘాతోన కుంత
పరశుముద్గర భిండిపాలాసిధేను
కాది మహోగ్రప్రహరణప్రయోగ
వైదుష్యమున నిరునంకలసేన
లహమహమికమీర నాహవభూమి
విహరించుచుండగా వెడలుచునున్న
భీషణదారుణావేశసంపూర్ణ
ఘోషణంబులకు దిక్కుహారంబులదరె.
ఖురధూళి దిక్కుదిక్కులకును చెదరె,
కరిఘీంకృతులకు దిగ్గజములు బెదరె.

శోణితధారల క్షోణితలంబు
శోణమై భయదమై చూపట్టసాగె ;
వికలాంగు లొనరించు వికృతనాదముల
కకుబంతములు ప్రతిక్రందిరవమీనె !

అంతట నాంధ్రమహావిష్ణునృపతి
యంతకంతకు దీవ్రమగు యుద్ధమందు
నిరువంకలన్ గూడ మృతులైనవారు
కరచరణములు వికలులైనవారు
ఖండితాంగులును లెక్కకు మిక్కుటమగు
చుండుట కనలేక వ్యూహంబునొకటి
నిపుణత మెరయగా నిర్మించి నిలచె
రిపుసైన్యములకు దుర్భేద్యమారీతి !

నాగులుపన్ను పన్నాగంబు లెవియు
సాగకపోవ నిశంభు డుగ్రుడయి
కదనరంగమున కఖండగర్వమున
కదలి యేతెంచి విక్రమము పెంపార
జయనాదముల్ సర్వసైన్యంబుచేయ
స్వయముగా వ్యూహవిధ్వంసంబొనర్ప

దలపడె — కాకుళ ధరణీశు డంత
నిలచె వానినెదిర్చి నిబ్బరంబుగను!
విసమును గ్రుమ్మరు వీక్షలబరపి
కసిదీర నాగుండు ఖడ్గంబునేసె!
దానిని విష్ణువు దారిలో శరము
తో నిల్పివైచి తుత్తునియలు సేసె!
శరమొండు పన్నగేశ్వరుడు సంధింప
విరచె కార్ముకమునే విష్ణుభూభర్త!!
ఉగ్రుడైన నిశంభు డోరిమిబాసి
యాగ్రహంబు నసూయ యావేశమొకట
ముప్పిరిగొనవచ్చి మొగ్గరంబునను
గప్పనఁ జొరబడగాఁ దలపడియె!
అంతట గదిసె ప్రత్యాసారసైన్య
సంతతి విష్ణ్వాజ్ఞఁ జక్రరూపమున
విజయ విధ్వానముల్ వినువీధి వెడల
భుజగవంశచమూ సమూహంబులడల.
మినుమిట్లు గొలిపెడు మొనపు యుద్ధమున
నురగసైన్యములు మృత్యువువాతఁబడియె:

సాహసంబలర ననసామాన్యమైన
వ్యూహంబు భేదింప బూనుకొన్నట్టి
యహినాథుడు నిశంభు డందున జిక్కి
పరిహతుడై యాజి వీరస్వర్గమందె !!!

"జయ విష్ణు నృపచంద్ర, జయకీర్తిసాంద్ర
జయ ధైర్యనిస్తంద్ర, జయ కాకుళేంద్ర ! "
యను జయధ్వానంబు లాకాశమంటె,
వినిపించె గోకిలల్ విజయగీతముల
కురిపించి రమణులు కుసుమవర్షములు
ధరణి నుప్పొంగె సౌందర్యహర్షములు.

# శ్రీ

# ఆంధ్ర

# మహావిష్ణువు



## పంచమాశ్వాసము



కలకలలాడె ప్రాక్కన్యకాముఖము
కిలకిలలాడెఁ బక్షిగణంబు లేచి
తళతళలాడె నిద్దపు దటాకములు
వెలవెలపోయె విన్వీథిఁ దారకలు
కలగుండు వడుచుఁ జీకటులు పర్విడియె
మిలమిలల్ విరియించె మిన్నుల రేడు.
ఆశుభోదయవేళ నంబరవీథి
రాశులై మెరసె స్వర్ణప్రవాళములు
ఆనవోదయవేళ నాంధ్రదేశమున
ఆనందరస తరంగాళి నర్తించె.

ఆనాడు జయపతాకారోహణోత్స
వానంద పరవశులైరి యాంధ్రాళి.
నాడు కాకుళమహానగరంబు నందు
వేడుకఁజేసిరి విజయోత్సవములు.
పసపు పూసినయట్టి ద్వారబంధములఁ
బసిఁడి వన్నెలు కనుపండువుసేసె!
కొమ్మల కోమలాంగుళులు దిద్దినవి
గుమ్మాల సరిక్రొత్త కుంకుమబొట్లు;
హరిత తోరణపంక్తులల్లిరి వేల
వరుసలుగా వీధిపందిళ్ళుగట్టి
సింగారములుగారు చిత్రిచిత్రిముల
రంగుల దిద్దిరి రంగవల్లికలు.
వలయమ్ములుగ నిల్చి పడుచుప్రాయంపు
చెలులాడ దొడఁగిరి చెమ్మచెక్కలను;
లతలనల్లిన యూయెలలనూగు బాల
లతను మార్గణముల యట్లు కన్బడిరి
ఝంపావినోద లాస్యములఁ గన్నియలు
శంపాలతా విలాసములు మెచ్చిరి.

గోనబురంగుల కాచగోళమ్ము లొకట
పునుగు జవ్వాదుల పొలపమ్ము లొకట
చల్లని పన్నీటి జల్లులింకొకట
ఉల్లమ్ములకు గూర్చె నుల్లాసములను.
ప్రాసాదశిఖర విభ్రాజితాలాన
భాసిత కేతనప్రభలతో నిండి
బృందారకు లలంకరించిరి కనుల
విందుగా ననిపించె విష్ణుపదంబు!
పటహ భేరీశంఖ పణవడమరుక
చటుల నిస్సాణ నిస్వానముల్ మొరసెఁ.
రింఖామహోత్థాన రేచితార్భటులు
ప్రేంఖితమ్మొనరించె వేలుపుఁ దెరువు!

విజయలక్ష్మీసమన్వితు డాంధ్రశౌరి
గజముపై నూరేగ గళమెత్తి ప్రజలు
జయజయధ్వానముల్ సలుపుచునుండ
వియదంగణములలో వేల్పులు వినిరి !

బాటలపై నిరువంకలనిల్చి
పాటలు పాడిరి బాలబాలికలు;

దరహాసవదన లంతఃపురాంగణలు
కురిపించినారలు కుసుమవర్షంబు;
వేదసంప్రోక్త సద్విధిజన్నిగట్లు
సాదరంబుగజల్లి రాశిపాక్షతలు.
కామినుల్ బరచు దృఙ్మాలికల్ పద్మ
దామమనోజ్ఞ సుందరత వెలార్చె.
పరిసరమ్ములనుండి వచ్చిన ప్రజలు
పరవశులై రుత్సవమ్ములఁ జూచి,
సామంతరాజు లాశ్చర్యమ్ము నడిరి;
భూమినా యుత్సవమ్ములగూర్చి కవులు
పలికి రనేక ప్రబంధముల్ తేట
తెలుగులో చిక్కని తేనియలూర!

అహితుల నొప్పించి యహింభీతి నెట్టి
మహిత సత్యసునీతి మార్గముల్ పట్టి
సమయాసమయ విచక్షణశక్తి కలిగి
సమబుద్ధి ధర్మరక్షణమందు మెలగి.
దేశనైశాల్యమే స్థిరసంచితార్థ
రాశిమూలంబని రాజనీతిజ్ఞు

డై యేలె నాంధ్రమహామధురిపు డ
జేయుడై యుర్వి నశేషకాలంబు.

అతని పాలనమందు సుభిక్ష
మై తెల్గునేల ప్రఖ్యాతిగాంచినది.
పంటపొలాలలో బంగారుపండె
ఇంటింట సిరులు సమృద్ధిగానిండె
ఫలభారమున వృక్షపంక్తులు వంగె
కులుకుటావుల పొదుగుల పాలుపొంగె
ప్రత్యబ్దము సకాలవర్షముల్కురిసె
నిత్యతుష్టిన్ ప్రజా నిలయముల్మెరిసె !

ఆంధ్రమహావిష్ణు వానాడె నాటె
నాంధ్రుల కీర్తి రా ములకు బీజ
మాంధ్రమహావిష్ణు ఆనాటినుండి
యాంధ్రజాతికి మూ మై విలసిల్లె !

ప్రభువె దైవంబను భక్తితత్పరత
యభిమానముల్ గల్గి యాంధ్రులునాడు
నిరుపమానంబుగా నిర్మించిరాంధ్ర
హరి పదాంకితముగా నాలయమ్మొకటి.

శిలలలో జీవంబు చిందుచున్నట్లు
నులిచినయట్టి స్తంభంబులతోడ,
ఘనశైలముల జేర్చి కట్టినారనగ
గనుపించునట్టి ప్రాకారాలతోడ
శేషాహిపై సుఖాసీనుడై జనుల
బోషించు విష్ణువు పుత్తళితోడ
లలితంబు శిల్పకళాకలితంబు
విలసిల్లినది యాంధ్రవిష్ణ్వాలయంబు
శ్రీకాకుళేశ్వర స్థిరతరకీర్తి
కాకరం బాంధ్ర జనానీకనుతము !

శ్రీయాలయము చైత్రయాత్రాప్రసిద్ధ మ
హాయోధులకు క్షేత్రమై వెలసినది;
ఆమూర్తి యాంధ్రవీరాధివీరులకు
భూమీశులకు పరిపూజితంబయ్యె.
అపుడు కళింగమహాప్రభువౌ గ
జపతిపైకి విజిగీషా మనీషుడు
వామ్నాయ మూరు రాయరగండ యవన
నిమ్న గేశాగస్త్యనిర్నిద్రకీర్తి

కృష్ణరాయండేగఁ గీర్తించినాఁడు
విష్ణు చిత్తీయ పవిత్రకావ్యమున
విష్ణునామము భక్తి వెలయ—చరిత్ర
తృష్ణతీరఁగ నేఁడు తిలకింతు మేని
కృష్ణవేణీతరంగి ఋగ్భ్రమలాంధ్ర
విష్ణువు గాథలు విన్పించుమనకు !

ఆంధ్రులకీర్తికి నాలవాలంబు
ఆంధ్రులశక్తికి నాదిమూలంబు
ఆంధ్రవిష్ణుచరిత్ర మతి పవిత్రము, మ
హాంధ్రావతరణ కల్యాణ సూత్రంబు !!

* * *

విరచించి నాఁడాంధ్ర విష్ణువుగాథ
వర రమాగిరి సుతా భారతీదివ్య
కరుణా ప్రసాదితాఖండ వాగ్ధాటి
సరసులౌననఁగ వజ్ఝల కాళిదాసు.

సమాప్తము.